# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120035199



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

**Subject**

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

**Language**

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# పిరదౌసి

## బుర్రకథ



రచన:

**G. S. N.** శర్మ (గీతాశ్రీ) B. A.,

కొండపల్లి.

కృష్ణా జిల్లా.



ప్రతులకు:

శ్రీ రాధాకృష్ణా బుక్ షాప్, జగ్గయ్యపేట.

కృష్ణా జిల్లా (A. P.)   వెల: రు. 1—00

ఓం శ్రీ వేంకటేశ్వరాయైనమః

# పిరదౌసి

## ముందుమాట

ఈ "పిరదౌసి" అను బుఱ్ఱకథ స్వర్గీయ జాషువా కవి "పిరదౌసి" ఖండకావ్యం చదివినాక నాలో కలిగిన ఓ రూప కల్పన. దీనిని 1960 ప్రాంతంలో వ్రాశాను. దాదాపు ఒక పుష్కరకాలం తరువాతగాని దీనికి వెలుగుచూచే భాగ్యం కలుగలేదు. ఎన్నికల సమయంలో ముద్రణ జరగడంవల్ల ఎన్నికల ప్రభావం కొంత ప్రసరించకపోలేదు. ఎన్నికల విషయాలు, ఇతర రాజకీయాలు మినహాయిస్తే - యీకథ నెల్లప్పుడూ చెప్పుకొనవచ్చు దీనిని ముద్రింపించి వెలుగుచూచే అవకాశం కల్పించిన శ్రీ మారం సత్యనారాయణ (శ్రీ రాధాకృష్ణ బుక్ షాపు, జగ్గయ్యపేట) వారికి కృతజ్ఞుడను. భగవానుడు వారికి చిరాయురారోగ్యైశ్వర్యములు ప్రసాదించుగాక !

మంగళం మహత్

ఇట్లు,

G. S. N. శర్మ (గీతాశ్రీ)

రచయిత.

మకాం: జగ్గయ్యపేట

6—2—1972

అవిఘ్నమస్తు ఓం శ్రీ వేంకటేశ్వరాయైనమః శుభమస్తు

# పిరదౌసి బుఱ్ఱకథ

## ప్రార్ధన విఘ్నేశ్వరస్తుతి - కీర్తన 1

శ్రీశంభుతనయం - శాంభవీసుతం
సురసేవితం - శుభా - దాయకం ॥శ్రీ॥

గణనాధ దేవం - కామితా ప్రదం
విఘ్న వారకం - విశ్వపూజితం
భక్తా జానాభీష్ట - ఫలధ కారకం
దాస శర్మ వినుత - ధరణి పాలకం ॥శ్రీ॥

## సరస్వతీ స్తుతి - కీర్తన 2

జయ జయ కమలజురాణీ - వాణీ
వీణాపాణి - వినోదదాయిని ॥జయ॥

నారదాది మునివందిత జననీ
నాదరూపిణీ - నవరసపోషిణి
నవపల్లవ కోమలి - నజురాణీ
నవజ్యోత్స్నసమ - హాసినీ - శుభాషిణీ ॥జ॥

## దేశమాత ప్రార్ధన

ఎన్నగాను - ఆంధ్రకన్న - మిన్న - దేశమున్నదా
సన్నుతింతుమాజననిని - సర్వశ్రేయములనొసంగ ॥ఎన్న॥

నన్నయ తిక్కన యెఱ్ఱన - ఆదికవుల గన్నతల్లి
పోతన వేమన గోపన - భక్తుల గన్నట్టితల్లి ॥ఎన్న॥

కృష్ణా గోదావరి పెన్నా - కావేరి తుంగభద్రిలాదిగ
జీవనదుల ప్రవహింపజేయు రాజీవమాత-పావనచరిత ॥ఎన్న॥
ఆంధ్రదేశపు - అమ్మల్లార ॥తంధానా తంధాన తంధన॥
కష్టించి శ్రమజేయు - కార్మికులార ,, ,, ,,
కామితములదీర్చు - కర్షకులార ,, ,, ,,
దేశమును రక్షించు - ధీరుల్లార ,, ,, ,,
విజ్ఞాన నిధులైన - పెద్దల్లార ,, ,, ,,
అల్లరిజేసెడి - పిల్లల్లార ,, ,, ,,
జోడుగుమ్మెటలు - జేరి మోగ్రగా ,, ,, ,,
నవరసములు నవనాట్యమాడగా ,, ,, ,,
రాగ గీత తాళాది నృత్యముల తంబురకథవినుడీ
తధికిణ ఝుం తరిత.

హాస్యగాడు:- ఒరే పెద్దనా - కార్మికులను, కర్షకులను, పెద్దల్ని సంబోధించావంటే అర్థముంది కానీ అల్లరిజేసే పిల్లల్నికూడా సంబోధిస్తున్నావేంరా?

కథకుడు:- ఒరే నాయనా మంచివాళ్లంతా మంచిపనులను ప్రోత్సహిస్తూనేవుంటారు. అవాంతరాలు కలిగించేది అల్లరివాళ్లే అందుచేత వారినికూడా ఆకట్టుకొంటేనేగాని యేకథా నడవదు మరి.

హాస్యగాడు:- ఔనురోయ్ - అందుకేగాబోలు నాటకాల్లో గూడ కొన్ని ఫ్రీ ప్యాసులుంటాయ్.

శివవాడు:- ఓరేయ్ హాస్యలింగం, నీకన్నీ అనుమానాలే నేమిరా. నేటి బాలలేగదా రేపటి పౌరులు. వీరిలో ఎందరు మహానాయకులు కానున్నారో,

ఇంజనీర్లు కానున్నారో, డాక్టర్లు కానున్నారో.

హాస్య :- యాక్టర్లు కానున్నారో

కథకుడు:- ఔనుమరి. అటువంటి బాలల్ని ముందుగా సంబో ధించటం భావ్యంగదా మరి. సరే యిహావిను.

సుజనులారనొక సుకవిచరిత్రము—సొంపుగానువినుడీ
సానుభూతితో-సదయహృదయులై-సాదరమునగనుడీ॥సు॥
సుకవీశ్వరులే దేశసంస్కృతికి—సువర్ణ పేటికలూ
కవులచరిత్రలు-కళాసంపదకు కనకాతురపుటలూ ॥సు॥

వచనం :- అలాంటి కవులలో ఘనుడును — ఓనాటి పారశీక దేశ సాహిత్య సామ్రాజ్య చక్రవర్తియు నగు పిరదౌసి యనునొక మహాకవి గాథను యీరోజు గానం చేయబోయేముందు

హాస్య :- స్టాప్:

వంతవాడు :- ఏవిటా్రి మళ్లీ యేమొచ్చింది.

హాస్య :- యేమిరావడమేమిటి పెద్దప్రమాదమే వొచ్చింది. ఏమంటావా, సమయమా ఎన్నికల సమయం — కాలమా మానవుడు చంద్రలోకంలో సైతం చరించివచ్చిన రాకెట్ యుగం. అట్టి స్థితిలో యేదేశనాయకుని చరిత్రో, యే రామాయణ భారత కథలో, లేకపోతే, యే గగారిన్ ఆమ్ స్ట్రాంగ్ల కథలో చెప్పక పాతచింతకాయ పచ్చడి వంటి కవికథ చెబుతానంటాడేమిటీఅంట. పోనీ— కవిని గురించే చెప్పదల్చుకున్నాడయ్యా అను కుందాం. మనదేశంలో కవులకు కరువొచ్చిందా

కంటోల్లోచ్చిందా! ఎన్నడో ఎక్కడో పుట్టి
చచ్చిన పిరదౌసి కథ చెబుతానంటే నేనూరు
కుంటానా! నాకొక్క పంరాదూమరి

కథకుడు:- ఓరి నీహడావుడి బంగారంగాను అదా నీసందేహం
ఐతే విను. మహాకవియైనవాడు దేశ కాల పాత్రల
కతీతుడు—చిరస్మరణీయుడు అదీగాక ఒక దేశంయొక్క
నాగరికత ఆదేశంలో వర్ధిల్లిన కళలపై ఆధారపడి
వుంటుంది. అందునా లలితకళలలో ప్రముఖమైనది
సాహిత్యం. అందుకే "సంగీతమపి సాహిత్యం-సరస్వతీ
స్తనద్వయం, ఏకమాపాత మధురం అన్యదాలోచ
నామృతం" అన్నారు పెద్దలు అట్టి కవియే జాతీయ
జీవనాని కాధారభూతుడు "నానృషిఃకురుతేకావ్యం"
అన్నారు. కవి మనదేశంవాడా—విదేశంవాడా అన్న
విమర్శ అనుచితం. ఇహ రాజకీయమంటావా ...
సందర్భానుసారంగా అన్నీ చెప్పుకుందాం. కథ నడవనీ
మరి !

హాస్య :- కానీ ఐతే

వ॥ అట్టి మహాకవిగాథను గానంచేయబోయేముందు
ఘనుడగు నన్నయను ఘనముగదలచి

॥తంధానో తంధాన తంధనా॥

తిక్కనార్యునే — మక్కువతో గొలచి ॥తం॥
ఎఱ్ఱాప్రగ్గడ — నెనరున ధ్యానించి ॥తం॥
పోతనామాత్యుని — ప్రఖ్యాతి వినుతించి ॥తం॥
శ్రీనాథ కవివర్యు — స్థిరముగ మదినెంచి ॥తం॥

తెనాలి రామాది — సనాతనులగొలచి ॥తం॥
కవిసార్వభౌముల — ఘనముగ పూజించి ॥తం॥
అభ్యుదయ కవివరుల — నాదరంబునదలచి ॥తం॥
ఆదర్శ కవులకు — అంజలి ఘటియించి ॥తం॥
కళామూర్తులకు — కళాకారులకు ॥తం॥
సుస్వాగత - సుమ సరుల - సమర్పించి ॥తం॥

హాస్యగాడు - ఆగాగు నాకవిత్వంగూడా నాలుగు వాక్యాలు
కలుపు.

వంతగాడు :- అదేమిటోయ్

దేశభక్తులకు — దండాలని చెప్పి తంధాన
దేశనాయకుల — దీవెనలనర్థించి ,,
దేశరక్షణలో — దేహాలే బాసిన ,,
వీరజవానుల — వీరత్వమున్ దలచి ,,
అత్యంతభక్తితో — నంజలి ఘటియించి ,,
తంధానో — తంధానా ఓ దేవనంతనానా.

తధికిణ ఝుం తరిత.

వ॥ ఈవిధంబుగా ప్రార్థనాదికంబులు గావించినయనంతరంబు
కథారంభంబు గావించుచూ ప్రపంచవర్ణనము దెల్పు
చున్నాను సుమా.

కలియుగంబునా-ఖండాలారూగలవు ప్రపంచమునా
ఖండాలేగలవు ప్రపంచమునా

ఆసియ, యూరపు ఆఫ్రికఖండములనునవి తంధానా
ఖండాలేగలవుర తంధానా.

అమెరికా ద్వయము ఆస్ట్రియాలలో ఆరై యుండెరా
ఖండాలై ఆరై యుండేరా

వ॥ అలావున్న ఆరు ఖండాలలో
ఆసియా ఖండము వుండె రా ॥సై॥
ప్రపంచమందున మెండుగా ,,
సిరిసంపదలలో దండిగా ,,
ఆసియా ఖండంబందునా ,,
భారత దేశం ఒకటిరా ,,
చైనా దేశం ఒకటిరా - ఆఫ్ఘనుస్థానం మరోటిరా
భళానంటెభాయితమ్ముడా । మేల్భళానోయ్ దాదానా॥

వ॥ అలాంటి ఆఫ్ఘను స్థానానికి

అందచందముల నలరారెడి యాఫ్ఘనుస్థానంబునకూ
గజనీయనునది ముఖ్యపట్నమై ఘనతవహించెనురా
వినరా ఆంధ్రకుమారాధీరా—పిరదౌసి కవిగాధా
సామాన్యముగా యేపురిదానికి సాటిలేదునాడు ॥విన॥
రంతిదేవపురి వింతశోభలే సంతరించెనచటా ॥విన॥

వ॥ ఎందుచేతనయా—ధృతం తళాంగుతోం

వినరా ఆంధ్రకుమారా ధీరా—పిరదౌసీగాధా భళాభళి
హాటకనిర్మితమైన సౌధములు—అతిచిత్రముగానూ ॥సంగవి॥
మణిమయరత్నాలంకృతులౌ బహుమేడిమిద్దెలరయా
కోటలు బురుజులు కొత్తళంబులు—ఘోటకశాలలును
వీధివీధినా మసీదులును—బహు విపణివీధులున్నూ

మక్కానగరము నెక్కిరించె—మతమాన్యతనాగజనీ.
తథాంగు ఝుం తరిత.

ముదమున నాపురినేలెడుప్రభుడు—మహమ్మదు వంశజుడు
వినరా ఆంధ్రకుమారాధీరా పిరదౌసీ గాథా॥

మతపాలనమున—మహమ్మదుగారినె మరపించినాడండీ
సాటిలేని బహుదేశములెన్నో—జయించినాడండీ ॥వినరా॥
గజనీమహమ్మదుయని చరిత్రలో–ఖ్యాతిగాంచినాడూ॥

వ॥ అట్లు సకలశోభాయమానంగా ఆఫ్ఘనుస్థానాన్ని, ఏకచ్ఛత్రాధిపత్యంగా పరిపాలిస్తున్న గజనీమహమ్మదు ప్రక్కనే వున్న భారతదేశాన్నోమారు చూచాడు.

హాస్య :- అలనాడలెగ్జాండరూ, ఆతర్వాత చైనా వాళ్లు, యీమధ్య పాకిస్థానువారు చూచినట్లు.

భారతదేశం లోపలా ॥సై॥
ఎన్నోప్రాంతాల్ గలవురా ॥సై॥
ఎన్నో ఆచారాల్ గలవురా
ఎన్నోభాషలె గలవు ॥భళానంటెభాయి॥

ఎత్తైన కొండలె గలవురా
ఎన్నో అరణ్యాల్ గలవుగా
ఎన్నో పంటలు పండురా
రత్నరాసులకానాచిరా, రత్నగర్భయని పేరురా ॥భళా॥

ఎన్నో రాజ్యాల్ గలవురా
ఎందరో రాజులున్నారురా

ఎన్నో విభాగాల్ గలవురా
ఎంతజనాభాయున్నరా । నాడు ఐకమత్యమదిసున్నరా ॥ధ॥

వ॥ అట్లు ధనధాన్య కనక వస్తువాహనాది సిరిసంపదలచే సర్వాంగసుందర శోభితమైన భారతదేశాన్ని చూచిన గజనీ ఏమిచేసినాడయ్యా

సుల్తాను గజనీ మహ్మదూ ॥సై॥
సుందర హిందూ దేశమున్
చూచి సహింప జాలకా
ధనధాన్యంబుల దోచగా
రత్న గర్భ హిందు దేశమున్
కత్తిదూసి కొల్లగొట్టాడా ॥భళానంటిభాయి॥
సోమనాధ దేవాలయం
స్వర్ణరాసులను దోచెరా
దేశమందలి సిరిసంపదా
కొసరి కొసరి కొల్లగొట్టాడా ॥భళానంటె॥
సుల్తాను వీర విహారమున్ ॥సై॥
సుంతమైన యడ్డగించగా ॥సై॥
నాటిభారత ప్రభువులు ॥సై॥
తమలోతాము కలహించుకా ॥సై॥
ఐకమత్యము లేకయుంటచే ॥సై॥
ఎదురుపోరాడగలేకనే—గజనీకి దాసోహమన్నారా ॥భళా॥

యీావిధంబుగా గజనితా
పదునెనిమిదిమార్లు పట్టుతో

హిందు దేశమునంత దోచెరా
లెఖ్ఖలేని ధనరాసులనే—మిక్కిలిగా కొల్లగొట్టాడా ॥భళా॥

హాస్యగాడు:- ఆగవయ్యా ఆగు. హిందూదేశం అంతా వీరులకు శూరులకు పుట్టిల్లని, పౌతుగడ్డయని ఇందాకటినుంచీ ఏమేమో కోస్తున్నావుగదా ఒక విదేశీయుడు పద్దెనిమిదిసార్లు దేశాన్ని దోచుకపోతుంటే వీళ్లు వినోదంచూస్తూ వూరుకున్నారయ్యా?

వంతగాడు:- అదేనయ్యా మన దేశంలోగల ఆనాటి దౌర్భాగ్యస్థితి దేశమంతా చినచిన్న రాజ్యాలుగా విడిపోయివున్నది. యీచిన్నచిన్న రాజ్యాలను పాలించే ఆచిన్నారి రాజులంతా ఎల్లప్పుడూ ఒకరితో ఒకరు కలహించుకొంటూ - తమదాకావచ్చిందాకా తమకుపట్టుపట్టువూరుకున్నారు. యీ అనైక్యత నవకాశంగా తీసుకొని గజనీ ఒకరితరువాత నొకరుగా అందర్నీ కొల్లగొట్టాడు

హాస్యగాడు:- నాకొక కథ జ్ఞాపకం వస్తోందిరా!

వంతగాడు:- ఏమిటారి ఆకథ.

హాస్యగాడు:- అనైక్యతను గురించిన కథను చెప్పవలెను.

కథకుడు:- ఆవిధంగా దేశాన్నిదోచిన గజనీ ఆసంపదనంతా ఏంజేశాడయ్యా?

బంగారునాణాల బస్తాలకెత్తించెరా ॥తంధాన॥
బస్తాకెత్తించెరా

శ్వేతపచ్చలనన్ని గోత్రాలకెత్తించెరా ॥తంధానా॥
కురవిందమణులనె కుంచాల గొల్పించెరా ॥తంధానా॥
సర్వసౌభాగ్యమె సంగ్రహించిపోయె ॥తధికిణ ఝుం తరిత॥

వచనం:- అవిచ్ఛిన్నంబుగా సుందర హిందూదేశాన్నంతా తన అవక్ర పరాక్ర విక్రమంబున పదునెన్మిదిమార్లు దోచి భారతాన్ని గజగజలాడించి, గంగలో కత్తి కడిగి గజనీకిచేరిన మహమ్మదు గజనీ ఏంచేశాడు.

హాస్యగాడు - ఏంచేశాడు—భోంచేశాడు. చచ్చునన్నరచచ్చు ప్రశ్న. నిన్న మొన్నటివరకూ పాకిస్తాన్ సైనిక నియంతలు బంగ్లాదేశ్‌లో దోచుకొన్న ధనాన్ని ఏంచేశారు? ఒకడేమో అక్కడెక్కడో ఒక దీవినే కొనుక్కున్నాడట మఱొకడు విదేశ బ్యాంకుల్లో దాచుకున్నాడు మరికొందరు పెద్దపెద్ద పరిశ్రమలు నిర్వహిస్తున్న బడా పెట్టుబడిదారుల్లో కొందరట.

కథకుడు:- అదే విను మరి

వినరా ఆంధ్రకుమారాధీరా పిరదౌసి కవిగాథా ॥వినరా॥
భరత దేశమున దోచినధనమును బాగుగ వెచ్చించి
నవ్యమనోహర దివ్యసౌధముల రయమున నిర్మించె
పసిడికుడ్యముల యాణిముత్యముల బాగుగ చెక్కించి
రత్నఖచిత స్తంభంబులనెన్నో రమ్యముగాగట్టె
మేడలు మిద్దెలు మసీదులు బహుమందిరముల్ గట్టె
భరతదేశ దేవాలయశిల్పాల్ పారశీకమందు
వెలసినవచ్చట వింతరీతులుగ విధివశమునసాడూ.

హాస్య :- ఔనయ్యా అది కాలప్రభావం. నిన్నటిదాకా తన కెదురులేదనుకున్న అమెరికావారు వియత్నాంలో చావుదప్పి కన్నులొట్టబోయి పూరుకున్నారు. తన కత్తికి యెదురేలేదనుకున్న యాహ్యాఖాన్ పాపం తన రాజ్యంలోనే, తనమిత్రులపాలనలోనే బోనులోబడ్డ యెలుకలాగా గృహనిర్బంధంలో వున్నాడు.

కథకుడు:-. అటుపిమ్మట ఒకనాడు సుల్తాను గజనీలో దర్బారు నేర్పరచి ఆనిండు పేరోలగంబున

వీరభటుల రావించెరా ॥సై॥
యుద్ధ నిపుణత్వంబు మెచ్చెరా
బిరుదుల నెన్నో యిచ్చెరా
సర్దారులని గౌరవించాడా ॥భళానోయ్॥

సేనాపతులని పిలిచెరా
సన్మానాలే జరిపెరా
లెఖ్ఖకుమీరిన పచ్చలా మక్కువతో వారికిచ్చాడా
॥భళానోయి॥

హాస్యగాడు:- ఔనుమరి. అత్త సొమ్మును అల్లుడు బహు ధారాళంగా దానం జేశాడట. అల్లావుంది. దోచుకున్నది పంచుకున్నారన్నమాట

కథకుడు:- ఔను. ఆవిధంగా మంత్రి సామంత, సేనానాయక, దండనాయక, వీరభటాది శూరులనెల్లరనూ, యథోచితంగా సత్కరించిన యనంతరంబు ఆ గజనీ సభికుల నుద్దేశ్యించి ఏమంటున్నాడయ్యా అంటే

సభికులార బహుసుదినము నేడు సంతోషమాయె॥వినరా ఆంధ్ర॥
విజయలక్ష్మినే వరించి తెచ్చితి వీరుడనై మీకూ
వీరచిహ్నమే నాయీ చరితము వీనులవిందుగను
శూరులైన మా పూర్వపు గజనీ సుల్తానుల చరిత
ఆచంద్రతారార్కమౌనటుగా ఆదర్శ కవితతోడా
రచించు కవికే బహుమతులొసంగెద రండువారలెవరో॥
అనిపలుక సుల్తానుగారి తత్వమెరింగిన యాస్థానకవులెవ్వరూ
మారుబల్కసాహసింపరాయె కారణమేమన
మెచ్చినవారికి ముదముగా
నవరత్నంబుల నిచ్చురా
మెచ్చకున్న బల్ కచ్చతో
శిరచ్ఛేదన జేసి చంపురా ॥భళా॥

హాస్య :- ఔను మరి అవివేకి కాగ్రహము వచ్చినా కష్టమే.
అనుగ్రహము వచ్చినా కష్టమే. వెనుకటికోసారి
(నవాబు-బ్రాహ్మణగాయకుని కథ చెప్పవలెను)

కథకుడు:- ఔను అదేవిధంగా గజనీ ఆస్థానంలోవున్న కవు
లెల్లరూ భయసంకోచములతో మాటలాడకున్నందున
నాటి పారశీక దేశపు మధురకవులలో నగ్రగణ్యుండగు
"పిరదౌసి" కవిని రావించి, సత్కరించి ఏమంటున్నా
డయ్యా అంటే

వినవోయి కవివర్య విమలచరిత్రుడ॥ తంధానా తంధానతంధన॥
రాజు నేను కవి రాజవు నీవు ,,
మాకుల భూషణు లగు సుల్తానుల ,,

చరితము సొంపుగ చిత్రించుమయ్యా ॥తంధానా తంధానతంధన॥
కవిని గన్నతల్లి గర్భంబు ధన్యంబు ,,
కృతిపతియూ భూపతి మృతియే లేదూ ,,

అంతేగాక

వినవోయి పిరదౌసి కవివరా ॥సై॥
రత్నగర్భ హిందు దేశమున్ ,,
పదునెన్మిదీ పరియాయముల్ ,,
అడ్డులేని శౌర్యంబుతో ,,
జయించినావీర చరితము ,,
ఆచంద్రతారార్క మౌనటూ ,,
చరిత్రలో సుస్థిరత్వమూ ,,
గల్గునట్టియొక్క కావ్యమూ ,,
వ్రాయ నీవె సమర్ధుండవూ ,,
ఏ కృతినే నాకిచ్చి నా ,,
మనమున నెంతో మెచ్చెదా ,,
పద్యమునకొక్క దీనారమే బహుమతిస్తాననిపల్కాడా
॥భళానోయి॥

హాస్యగాడు:- ఔనుమరి యే దేశంగాని యేప్రభుత్వంగాని కవులను, కళాకారులను ఎంతఉన్నతంగా ఆదరిస్తుందో ఆదేశంయొక్క నాగరికతా సంస్కృతులు అంత మహోన్నతంగా వుంటాయి. చరిత్రలో దీనికి చాలా ఆధారాలుంటాయి.

వంతగాడు :- ఔను. అలనాడు భోజమహారాజు ఎందరో మహాకవుల నాదరించాడు కాళిదాసువంటి మహా కవులీగడ్డపై ప్రుద్భవించబట్టే నేటికీ భారతీయసంస్కృతి ఖండాంతరాలకుసైతం వ్యాపించివుంది ఆపిదప ఆంధ్ర కర్ణాటక సామ్రాజ్య సార్వభౌము డనిపించుకొన్న శ్రీకృష్ణదేవరాయలుగూడా కవులను కళాకారులను ఎంతగానో ఆదరించేవాడు. అక్కడదాకా ఎందుకు. మన ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఆస్థానకవి పదవి నేర్పరచి, తనకు కళలపైగల గౌరవమును ప్రకటించు కొనుచున్నది.

కథకుడు:- వినండి - అప్పుడు

గజనీపల్కుల ఘనముగవిన్న ॥తంధానా తంధాన తంధన॥
కవిశేఖరు డెంద మానంద మొందె ,,
నిరాశ్రయముగా నిలచిన తవకవిత ,,
రాజాదరమున రంజిలునని తలచి ,,
అమితానంద హృదయారవిందుడై ,,
నిశ్చయతాంబూల పళ్లెముచేత నిశ్చింతగబూనే ,,

వ॥ఆవిధంగాసుల్తానుచే యాదరింపబడినకవిమహదానందంతో తన విడిదికేతెంచి ఒకానొక సుముహూర్తాన "షానామా" యనుపేరుతో సుల్తానుల వంశచరిత్రను కావ్యంగా వ్రాయ నారంభించాడు. ఎలావ్రాస్తున్నాడయ్యా అంటే

సంగరరంగ విహారధీరా శాత్రవసంహారా ॥భళాభళి॥
తీయనిపదముల తేనియలూరగ తెచ్చి యేర్చికూర్చి

అందమైన కావ్యాలంకారము లందందున జేర్చి
వ్యంగ్యపదంబులదఱచి భావముల వ్యక్తముగా పేర్చి
బలుశాసనముల బరిశీలించి పౌఢిదప్పకుండా
సాహిత్యపోషణా చరిత్రసత్యము జతగానడిపించీ
సాటికవులు శహబాసనిమెచ్చగ షహనామాగ్రంథం
రాజవంశ చారిత్రగాధగా రమణీయంబాపా
రచియింపసాగె కవిసార్వభౌముడటు నుచితంబగురీతిన్॥

వ॥ ఈవిధంగా గ్రంథరచనకై, యహోరాత్రములు అవిరళ కృషిసాగిస్తూ కొంతకాలం గజనీలోనే గడిపాడు. కవిగారు ఓనాటిరాత్రి తన రచనముగించి ఒక్కింత విశ్రాంతికై మేనువాల్చాడు. గాఢ నిద్రాదేవత యాతన్ని పూర్తిగా యావరించింది. ఆనిద్రలో అతనికొక స్వప్నం వచ్చింది. ఆ స్వప్నంలో

మేలిమి బంగారు మేనితో ॥సై॥
విశాల నేత్రద్వయంబుతో ,,
తుమ్మెద రెక్కల బోలినా ,,
సుదీర్ఘమౌ ముంగురులతో ,,
మేలిముసుగు ధరియించినా । కాంతయొక్కతె గానుపించెరా
॥భళానోయి॥

కవిచెంతకేతెంచి కాంతరా సై
మేనుతట్టి మేల్కొల్పెగా ,,
కనులదెరచి కవిగాంచెరా । కాంత కనుల కన్నీటిని ॥భళా॥

కవియెంతో ఖేదము నొందెరా    సై
కాంతదరికె తానరిగెరా    ,,
కారణమేమని యడిగెరా    ,,
అయ్యో బిడ్డాయనుచునా । యబలయదృశ్యంబాయెరా ॥ భ॥

వ॥ అట్లదృశ్యంబైన యామగువకొరకై కేకలువేయుచూ కవి మేల్కొన్నాడు యీవిషాద దుస్స్వప్న ఫలితమేరీతిగా నుండునోయని భయాందోళితమానసుండై కడమ రాత్రి భాగము నెట్లోగడిపాడు. ఉదయభానుడు పూర్వాద్రి నలంకరించు చున్నంతలో కవియొక్క స్వగ్రామమైన తూసు నగరమునయున్న యాతని భార్యవద్దనుండి వార్తా హారుడొక జాబు తెచ్చియిచ్చాడు. ఆతురతతో జాబు విప్పి చూచిన కవి హతాశుడైనాడు. అందులో ఏమున్నదంటే

శివరంజని

నాధా మన ప్రియ పుత్రిక చచ్చినదీ నాదు భాగ్యరేఖా
మనపరగతులను ఒసగెడిసుతుడు మనకికగనరాడూ
అన తనభార్యావ్రాసినలేఖా నాసాంతముచదివీ
దుఃఖభారమున పయనమయ్యెకవి తూసునగరమునకూ

వ॥ అట్లు స్వగృహానికేతెంచిన కవి తనకు సంభవించిన పుత్రి వియోగానికెంతగానో విలపిస్తున్న తనభార్యకు వేదాంత మార్గములెన్నియో బోధించి ఓదార్చుచూ కాలంగడప సాగినాడు. "ఋణానుబంధ రూపేణా పశుపత్ని సుతాలయాః" అనే నిశ్చలభావంతో భగవద్ధ్యానంలో సంసారయాత్ర

సాగిస్తూ రెండేండ్లు గడిపాడు. ఆ దంపతులను పుత్రవియోగ దుఃఖంనుంచి విముక్తుల జేయుటకోయన్నట్లు భగవంతుడు వారికొక కుమార్తెను ప్రసాదించినాడు. కాలచక్రంలో ఐదాకులు దొల్లిపోయినాయి. గ్రంధ రచనావిషయమై సుల్తానునుండీవార్తలపై వార్తలువస్తూనాన్నాయి ఒకానొక సుముహూర్తాన కవి సతీసుతసమేతుడై గజనీ పట్టణానికివచ్చి మరల గ్రంధరచన కుద్యమించాడు.

ఆవిధంబుగా పిరదౌసీ షహనామా గ్రంధంబూ
రచియింపబూనే రయమున మనమున। రంజిల మోదంబూ
కదనరంగముల ఘనవిజయాలను కండ్లగట్టినట్లూ
గజనీవంశసుల్తానుల పాలన సబక్తజీన్ చరితా
అరువదివేలా పద్యంబులలో నాకర్షణీయముగా
సర్వాంగసుందరమౌనటు రచించె సాటికవులుమెచ్చా
వినరా ఆంధ్ర కుమారాధీరా పిరదౌసి కవి గాథా.

హాస్యగాడు:- అయ్యా కథకుడుగారూ నాకు తెలీకడుగుతానూ అంతటి మహాకవిగదా రాజుగారిచ్చే ధనానికి లోభించి అన్నికష్టాలుబడి కావ్యం వ్రాయకపోతే నేమంట

వంతగాడు:- నిజమే. అంతటి మహాకవినీ ఆధనవ్యామోహామే పతనంజేసింది. పోతన మహాకవి తన భాగవతాన్ని వ్రాసేటప్పుడు ఏమన్నాడు -

ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి। పురంబులు వాహనమ్ములున్
సొమ్ములుగొన్ని పుచ్చుకొని। సొక్కి శరీరమువాసి కాలుచే

సమ్మెటపోటులంబడక। సమ్మతి శ్రీహరికిచ్చి జెప్పినీ
బొమ్మెర పోతరాజొకడు। భాగవతంబు జగద్ధితంబుగన్.

అని శపథం చేసినాడు. మరి అందరూ అలాంటి మహానుభావులూ, నిస్సంగులూ వుంటారా - ధన కాంక్ష మహాచెడ్డదిగదా ?

హాస్యగాడు:- ఔనురోయ్ -

హలాగ్రే నహతామాతా విషాన్నేన సుతాహతా
మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయ నమోనమః
(కథ చెప్పవలెను)

కథకుడు:- ఎంతటి మహాత్ములోతప్ప ధనమునకు దాసులు గానివారెవ్వరుంటారు. అదీగాక మన పిరదౌసి కవి అంతగా శ్రమపడుటకు మరియొక కారణంగూడా వుంది అదేమంటే

తంధానా తంధాన తంధనా ॥తం॥
ముప్పదేడులా తన యాకృషిచే
సర్వాంగసుందర శోభితమైనా
కవితాలతాంగిని కృతిభర్తయైన
సుల్తానుకర్పించి సంతోషమునుగూర్చి
సుల్తానిచ్చెడి స్వర్ణధనముచే
వయసుకొచ్చినా ఒక్క కుమార్తెకు
వైభవంబుగా వైవాహమున్ జేయు
సంకల్పంబున సంతోషించుచుండె ॥తంధాన తాన॥

యీవిధంబుగా నువ్విళ్లూరుచూ ముప్పదియేండ్లపాటు నెత్తురోడ్చి తన శారీరక మానసిక శక్తులనన్నీ ధారపోసి సృష్టించిన తన కవితాలతాంగి నత్యంతశోభాయమానంగా నవ్యరీతుల నలంకరించి సుల్తాను సన్నిధికి తీసుకవెళ్లాడు పిరదౌసి కవి. సుల్తాను కవీశ్వరు నెంతో యాదరించి, మఱునాటి నిండు పేరోలగంబున కృతిసమర్పణ జరుపవలశినదిగా కోరాడు. కవియూ అందులకంగీకరించి ఆనాటికి తనబసకేగి మరునాడు తన కావ్యాన్ని గానం చేయుడానికి దర్బారున కేతెంచాడు. ఆసభాస్థలి యెలావుందయ్యా

వినరా ఆంధ్రుడ పారసీకకవి పిరదౌసీ కథనూ
రత్నఖచిత సింహాసనంబునా రాజు కూరుచుండే
సామంతప్రభులెల్లరు నొక్కాసరసన కూర్చుండే
సుబేదారులు హవల్దారులే బారులుదీర్చారా
పురజనులును అంతఃపురజనులే (బహు) పరాకుగానుండే

తధికినతోం

పారశీకదేశ పండితులొకప్రక్క ॥తంధానా తంధానతంధన॥
ఖ్యాతిగాంచినా కవివీరలొక చెంత ,,
వ్యాకరణశాస్త్రాది వేత్తల్ వేరొకప్రక్క ,,
తర్కమీమాంసాది శాస్త్రజ్ఞులొకవంక ,,
పిరదౌసి విరచిత షానామా గ్రంథం ,,
వినవేడుకతో వరుసలుదీర్చారా ॥తంధానో॥

అట్లు కవి గాయక తర్కమీమాంస వయ్యాకరణాది శాస్త్రజ్ఞులచేతను, చతుష్షష్ట్యాది సర్వకళాసంపన్నులైన మేధావుల

చేతనూ, మంత్రి సామంత దండనాయక మండలాధీశ్వరాది పాలకులచేతనూ, ఇంద్రసభనుబోలిన యాసుల్తానుని నిండు పేరోలగంబున ఉచితాసనుండయి మన పిరదౌసీ కవి సార్వభౌముడు తనకావ్యాన్నెలా గానంచే

గజనీ పూర్వ సుల్తానులా సై
కఠోరదీక్షా పాలనా ,,
వారియాధ్యాత్మికనిష్ఠలా । ప్రతిష్ఠగారచియించాడా ॥భళా॥

తండిస బక్త జీన్ జీవితం సై
ఆతడుచేసిన యుద్ధముల్ ,,
శౌర్య ధైర్యముల వర్ణనా ,,
చరిత్రసత్యము తప్పకా । ధరిత్రిపై రచియించాడా ॥భళా॥

సుల్తాన్ గజనీ పాలనా సై
పారశీక దేశ వర్ణనా ,,
భరత దేశ దండయాత్రలా ,,
ఘోరయుద్ధ ఫలిత జయములా ,,
అరువదివేల పద్యాలలో అందమొప్ప కవి చదివాడా ॥భళా॥

దానిని విన్న సుల్తానుడూ సై
మదినెంతో సంతోషమందెరా ,,
మేల్మహాభాషని మెచ్చెరా ,,
పండిత కవితా ప్రకాండులూ ,,
భలేబేషంచూ పల్కారా ॥భళా॥

కృతి ముగించినా యాకవి సై
ముదముతోడ యిల్లు జేరెరా ,,
ఈర్ష్యాపూరిత మానసుల్ ,,
వైరులేమనీ రాజుతో ,,
పరోక్షంబునా బల్కిరో ,,
దీనారములకె బదులుగా । వెండినాణాలెయిచ్చాడా ॥భళా॥

హాస్యగాడు:- గోహిందా - గోహోవిందా. ఏమిటేమిటీ - అరువదివేల బంగారు దీనారాలకు బదులుగా వెండి నాణాలు పంపేడా ? నేననుకుంటూనే వున్నానయ్యా యిలాంటిదేదో జరిగితీరుతుందని లోభివానికి కలిగే త్యాగబుద్ధి - రాజకీయాల్లో కొందరి పార్టీ ఫిరాయింపుల్లా క్షణంలో మారిపోతూవుంటుంది. నాకొక కథ జ్ఞాపకం వస్తోందయ్యా వెనుకటికో పెద్దమనిషి ("తీర్థే గావః పతే దేనుః" కథ చెప్పవలెను.) యిదంతా బంగ్లాదేశ్ వ్యవహారంలావుంది ప్రజాపాలన అంగీకరిస్తామయ్యా-మీరంతా ఎన్నికల్లో పాల్గొనండయ్యా అని పాకిస్తాన్ అధ్యక్షుడు యాహ్యాఖాన్ పాకిస్తాన్ లోని ప్రజాస్వామిక పక్షాలన్నిటినీ కోరాడా? ఏం మాట్లాడవేమయ్యా - కోరాడా లేదా ?

వంతగాడు:- ఔనయ్యా కోరాడు.

హాస్య :- ముజిబుర్ రహమాన్ పార్టీ అయిన అవామీలీగ్ అత్యధిక మెజార్టీతో గెలిచిందా లేదా ?

వంతగాడు:- అవునయ్యా పాకిస్తాన్ లోని అన్ని పార్టీలకన్నా అత్యధిక మెజారిటీతో గెలిచాడు ముజిబుర్ రహమాన్

హాస్య:- ఔనా మరి. వారికి ప్రభుత్వాన్ని అప్పగించారా మరి - లేదు. ఏంచేశాడయ్యా యాహ్యాఖాన్ - తొంటచెయ్ చూపించాడు. పార్లమెంటూ - గీర్లమెంటూ జాన్తానై అన్నాడు. అదేమిటని అడిగిన బంగ్లా సింహం The lion of Bangla ను ఖైదులో పెట్టించాడు - ఎనిమిది మాసాలపాటు బంగ్లాదేశ్ లో పైశాచిక మారణహోమం జరిపించాడు యాహ్యాఖాన్. చివరకు భారత సైన్యం మన ఇందిరమ్మ నాయకత్వాన ముక్తివాహినితో కలసి బంగ్లాదేశ్ ను పాకిస్తాన్ పైశాచిక కబంధహస్తాలనుండి విముక్తి కల్గించారు. సోనార్ బంగ్లా స్వతంత్ర బంగ్లాగా అవతరించింది బోలో స్వతంత్ర భారత్ కూ జై.

వంతగాడు:- వరెవరె ఆపవయ్యా నీ ధోరణి. యిచ్చిన వాగ్దానం నిలబెట్టుకోవడం ఏకొందరికోగాని సాధ్యంగాదు మరి.

హాస్యగాడు :- అన్నట్టు నాకు తెలీకడుగుతాను. మనకు కొద్దిరోజుల్లో యెన్నికలు రానున్నాయిగదా. మన స్వాతంత్ర భారతాన్ని పాలిస్తున్న జాతీయకాంగ్రెస్ లోగడ ఏమేమి వాగ్దానాలు జేసింది? వాటిని ఎలా నిలబెట్టుకున్నదీ, ఇప్పుడేమేమి వాగ్దానాలు చేస్తున్నదీ కాస్త వివరంగా చెప్పు.

కథకుడు:- చెప్పక తప్పదా ?

హాస్య:- ఎలా తప్పుతుంది చెప్పు. ఎలక్షన్ల సీజనాయె మరి. చెప్పు నాయనా చెప్పు.

కథకుడు:- ఐతే చెబుతున్నా విను మరి.

తథాంగు తధిగిణతక తదిగిణతోం.

వినరా ఆంధ్రకుమారాధీశా విశదముగా నేడూ
స్వతంత్రభారత ప్రభుత్వంబునూ స్థాపించిన కాంగ్రెస్
పేదసాదలపాలిటి పెన్నిధి యనుచును బాగుగ తెలియుండి
దేశమందునా తిండికొఱతనూ దారిద్ర్యపుబాధన్
బాపుటకొఱకై ప్లానులనెన్నొ బాగుగాను వేసే ॥వి॥

హాస్యగాడు:- శ్రీమదద్రమారమణగోవిందోహరి

వంతగాడు:- అదేవిటయ్యా

హాస్యగాడు:- అయ్యా, జాతీయ కాంగ్రెసు ప్రభుత్వం యింతవరకూ చేసినపనీ, చేస్తానన్నపనీ చెప్పవయ్యా అంటే ప్లానులు వేశారు. ప్లానులంటాడేమిటయ్యా. నేనూ వేస్తున్నాను రోజుకొకప్లాను లచ్చాధికారిని గావడానికి.

కథకుడు:- అరే ఆసాంతం వినకుండా మధ్యలో అడ్డొస్తా వేమయ్యా ప్లానులంటే ప్రణాళికలన్నమాట. దేశములో కఱవు కాటకాలు రాకుండా, తిండికొఱత తీర్చేందుకు - దేశంలో నిరుద్యోగమును నివారించేందుకు.

హాస్యగాడు:- అందుకు ... ందుకు ... ందుకు అని
నాన్చిచంపకపోతే - అసలుసంగతి చెప్పవయ్యా

దేశమందునా తిండికీ సై
కొఱతినునదిలే కుండగా ,,
నూతన వ్యవసాయ పద్ధతుల్ ,,
కుత్రిమయెఱువుల వాడకం ,,
అధికముగా నమలు జరిపారా ॥భళా॥

వరదల నివారింపగా సై
విద్యుచ్ఛక్తి బుట్టింపగా ,,
బాక్రానంగల్ డాములూ ,,
నాగార్జున ప్రాజెక్టునూ ,,
మాచ్ ఖండ్ విద్యుత్కేంద్రము ,,
మేలుగాను నిర్మించారా ॥భళా॥

నిరక్షరాస్యత బాపగా సై
విజ్ఞానమూ పెంపొందగా ,,
మారుమూల గ్రామాలలో ,,
విద్యాలయముల బెట్టియూ ,,
కళాశాలల నేర్పరచియూ ,,
తేజోవంతుల జేశారా ॥భళా॥

దారిద్ర్యమును పారద్రోలగా సై
నిరుద్యోగము రూపుమాపగా ,,
చిన్నచిన్న పరిశ్రమలను ,,
పారిశ్రామిక వాడలన్ ,,
బహుళముగా స్థాపించారా ॥భళానోయి॥

యీవిధంగా దేశాన్ని అనేకరంగాల్లో పురోగమింపజేస్తున్నది నేటి మన భారత ప్రభుత్వం.

హాస్య :- ఐతే భూతలస్వర్గం చేశారంటావు.

కథకుడు:- అలా అనను. మనం చేసింది చాలా తక్కువ, చేయాల్సింది చాలా ఎక్కువవుంది. అందుకే దేశంలో సుస్థిరమైన ప్రజాప్రభుత్వం వుంటేగాని దేశాన్ని జాతిని ప్రగతిపథంలో నడిపించడానికి వీలుగాదు.

హాస్య :- గాన మీ ఓట్లన్నీ కాంగ్రెసుకే యిమ్మంటావు.

కథకుడు:- ఔను. ఇందిరమ్మ నాయకత్వాన గల జాతీయ కాంగ్రెసుకే మీ ఓట్లన్నీయిచ్చి సుస్థిర ప్రభుత్వం ఏర్పడుటకు ప్రతిఒక్క ఓటరు

హాస్య :- తమ పవిత్రమైన ఓటును నాపెట్టెలోనే, అదే నయ్యా కాంగ్రెస్ పెట్టెలోనే వేయ ప్రార్థన. చిత్తగించవలెను. ఇట్లు విధేయుడు - ఓరి నీతస్సదియ్యా కాస్తంత చెప్పవయ్యా అంటే అసలుకథను వదలిపెట్టి ఎంతదూరం లాక్కొచ్చావయ్యా —— పాపం ఆతర్వాత - అదే సుల్తాను పిరదౌసి కవికి తాను వాగ్దానంజేసిన బంగారు దీనారాలకు బదులుగా వెండినాణాలుపంపాడా అరెరె - ఎంతమోస మెంత మోసం. ఆ. ఆతర్వాతేంజరిగింది.

కథకుడు:- ఎన్నోఆశలతో నిర్మించుకొన్న పిరదౌసీ కవి ఆశాసౌధం కూలిపోయింది యిస్తానన్న దీనారాలకు

బదులు రాజు చేపంపబడిన వెండినాణెములనుచూచి హతాశుడైనాడు. ఆగ్రహావేశవివశుండై ఆధనాన్ని త్రిప్పపంపుతూ నిరసనతోగూడిన జాబొకటి వ్రాసి పంపాడు రాజభటులు ధనముతోబాటు జాబును గూడా తెచ్చి సుల్తానుగారికి యిచ్చారు. రాజా లేఖను విప్పిచూచినాడు. అందులో ఏమున్నదయ్యా

## పాట నెం. 1

ఓమోసగాడ గజనీసుల్తానా। లోభముతోనన్ మోసగించినావా

1 నీవాగ్దానాల్ నిజమనినమ్మి। నింగిని మేడలు గట్టుకొంటిరా
నీలోభత్వపరత్వముచే నాయాశాసౌధా లడుగంటినవి రాజ
॥ఓ॥

2 కసాయివానినిఘనునిగబొగడి। రాతిగుండె నేరంజింపజూచిన
నాపాపమెనన్నావరించెరా। నాదుపతనకారణమయ్యెను
రాజా ॥ఓ॥

3. హాయిగనీదుయశస్సునాబడు। చక్కనిసౌధముగట్టినందుకు
వట్టిచేతులతోబోయెదనింక। నాకంధకారమే మిగిలెను రాజ
॥ఓ॥

4 ఒక్కొకపదమొకనెత్తురుబొట్టుహరించెమేనిలోతక్కువగాగ
వృథాయయ్యెనాయత్నములన్నీ। వ్యథలేనాకికమిగిలెను
రాజ ॥ఓ॥

5. 'అల్లాతోడ'నిపల్కినాడ వీయసత్యవర్తనమేలరరాజా
నీయాచర్యలుఅల్లాకుసుఖమా। సత్యవాదియేస్వర్గానికర్హుడు
॥ఓ॥

6. ముప్పదినిండూవత్సరములుగా।ముదమునగడితిని
యశస్సాధమున్
అలసటదీర్చూకొందును రాజా।అహ మదు రాజుల
సమాధులల్లో ॥ఓ॥
7. యీావృద్ధాప్యపుదినములలోనా।ముద్దుకుమార్తెకు
పెండిలి జేసి
హాయిగ కాలముగడుపుదామనీ।ఆశించినయాశ
లడియాశలయ్యే ॥ఓ॥

వ॥ యీావిధంగా వ్రాయబడిన లేఖనాసాంతంగా చదివిన గజనీ

సంగరరంగ విహారధీరా శాత్రివసంహారా
ఉత్తరమును పఠియించిన గజనీ ఉగ్రితనొందాడా
తోకతొక్కినా కోడెతాచువలె రివ్వునలేచాడా
పట పట పట పట పటయని పలుమరు పళ్లుకొరికినాడా
కణకణలాడె చింతనిప్పులలె కన్నులెర్రజేసే
ప్రక్కనున్న సేనాపతిజూచీ పల్కుచునున్నాడా
అరెరె యెంతటిపొగరుబోతురా పిరదౌసీకవియూ
కన్నులేమి తలకెక్కినవానికి వన్ను దెలియకుండె
రాజద్రోహము జేసినాడనుచు రయమునయాగజనీ
అతనిని తేపటిలోన జంపుడని యాజ్ఞనిచ్చినాడా

ప్రభువుయొక్క భయంకరమైన యీ ఆజ్ఞనువిన్న సభికు లెల్లరూ ఒక్కమారుగా భయకంపితులై శిలాప్రతిమలై పోయినారు.

సుజనులారనొక సుకవిచరిత్రము సొంపుగానువినుడీ
సానుభూతితో సదయహృదయులై సాదరమునగనుడీ
ప్రియమైన యీఆజ్ఞ నువిన్నా పెద్దలుసభలోనా
ఆశ్చర్య భీతాహ వార్ధి మునిగిరే అందరచ్చటకటా
తృణమో ఫణమో రాజొసంగినది తృప్తితొగైకొనకా
గర్వించినాకర్మయనుభవించునని కఠినాత్ములుపలికె
దేవా ... ... ...
అహంభావమున అందరిలో తానధికుడనవన్నట్లు
అంగీకరించుట యతనిదోసమని అసూయాపరులనిరి
అతనినిబోలిన మహాకవొక్కడు అగుదనెపండితులూ
ధర్మతత్పరుల్ గజనీనినిందించి కవిగృహంబుకేగీ

ఏమంటున్నారయ్యా ... ఓ కవీ (సాకీ) సుకవీ

పిరదౌసి కవిరాజ పల్కుడుమేమని ॥తంధానా॥
దారుణవార్త యిది తెల్పుట యెట్లో ,,
సుల్తాన్ తలపైనీ సుమవర్ష ఫలితముగ ,,
నీశిరస్సునరాజు నిప్పులుబోసెర ,,
ఆశపడిన అరువదివేల దీనారాల్ ,,
నీఅంతముజూడగ పంతగించినాయా ॥తంధానో
తంధానా వో దేవనందనానా॥

నీ ఆవేశము నీ దుఃఖ్ఖమూ ॥తంధానా॥
నీదునిరాశా నీదుప్రియాసా ,,
తెలిపుచు నీనుండి తెచ్చినలేఖా ,,
చదివిన సుల్తాను ఛర్రునలేచీ ,,

అగ్నికి ఆజ్యము ఆహుతియైనటు ॥తంధానా॥
అసూయాపరులా యవకాశమున్ గొని ,,
చెప్పినమాటలు చెవినిబెట్టెరా ,,
కృతఘ్నుడైన యాగజనీసుల్తానుడు ,,
అయ్యో నినుజంప నాజ్ఞయిచ్చినాడా ॥తంధానో
తంధానా వో దేవనందనానా॥

వి॥ విషాదభయపూరితమైన యీవార్తనువిన్న పిరదౌసీ కవి నిరాశాపూరితమగు మందహాసమొనరించి "కానిండు - 30 సంవత్సరముల వయస్సునూ, నాబుద్ధిలోని చురుకుదనమునూ దారవోసి తయారుచేసిన నాకవితాలతాంగిని దొంగిలించిన యాసుల్తాను కడకు నాప్రాణాలనుసైతం హరించాలనుకొంటే అలానేకానివ్వండి ఒకవంక జరాభారంతో పీడింపబడుచున్న నేను చావునకువెఱచి ఎంత దూరమని పారిపోగలను. నాసారస్వత కాంతతోబాటు నా జీవనకాంతులను యీగజనీకే సమర్పించి ఆ ఖ్యాతిని గూడా సుల్తానుకే దక్కిస్తాను" అనివంత అచ్చటనున్న శ్రేయోభిలాషులు కొందరు ఏమంటున్నారయ్యాఅంటే

పుణ్యమూర్తియో పిరదౌసి కవిరాజ ॥తంధానా॥
మాపూర్వపుణ్యంబు మాదుపూజలా ,,
ఫలితముగానీవు పారశీకమున ,,
జన్మమందితివి జనములు బొగడగ ,,
దయతో మామొర తప్పకనాలించి ,,
దేశమువదలి దయచేయుడయ్యా ,,

ప్రాణాలుండిన భాగ్యము దేవచ్చు ॥తంధానా॥
మీ శ్రేయస్సునకై మేమెప్పుడు ,,
శాయశక్తులా కృషిసల్పెదమనిరీ ॥తంధానా
తంధానా వో దేవనందనానా॥

వ॥ ఇంతగా ప్రాధేయపడుచూ కోరిన తన శ్రేయోభిలాషులగు పెద్దలమాటల గౌరవించి తనకిష్టములేకున్ననూ పిరదౌసి దేశమును వదలిపోవ నిశ్చయించుకొన్నవాడై తనభార్యా పుత్రులతో పేదరికము, వృద్ధాప్యమూ జంటగా వెంట రాగా గజనీపట్టణమును వదలి వెళ్లుచూ ప్రతిదినమూ సుల్తాను నమాజు చేయు మసీదుముందర ఒక్కనిమేషమాగి అల్లాను ప్రార్థించి ఆమసీదుముంగలి గోడపై "ముత్యము లకు నిలయమైన సముద్రములో అనేకమారులు ముని గియూ ముత్యములను బడయలేని నిర్భాగ్యుడనైతిని" అను నర్థమువచ్చునట్లు విషాదపూరితమైన తన జీవిత గాథను తెల్పు కొన్ని పద్యములువ్రాసి ఆపట్నమును వదలి మహారణ్యంగుండా ప్రయాణం సాగిస్తూవున్నాడా మహాకవి అప్పుడు ప్రకృతి యెలావున్నదయ్యా

తంధానో తంధాన తంధనా తానతంధనానా

పశ్చిమాద్రినా తరుణభానుడే పరితపించెననగా
అరుణముఖుండై యతిజుగుప్సతో నస్తమించెనపుడూ
ఆకసమంతా కారుమేఘములు ఆవరించెనపుడూ
ఉఱుములు మెఱుపులు ఉధృతమయ్యెను ఊగెనుతరువులునూ

కారుచీకటులు క్రిమ్మెనల్దెసల కాననంబునంతా
రూపమునొందిన ప్రళయమోయనగ రూక్షతవహియించె

వ॥ ఆవిధముగా ప్రళయకాల భయంకరముగానున్న నాకాశ నమున ఎండిన పండుటాకులుసైతం మానిస్సహాయ కవి కుటుంబమును బెదరించుకోయనునట్లు వారిపాదములక్రింద బడి గలగలమని శబ్దముచేయుచూ వారిని మరింతభీతావహ పరచుచున్నది. అదృష్టహీను లందరకూ లోకువేగదా! యిక్కడ గజనీపట్నంలో పరిస్థితి ఎలావుంది

పిరదౌసి పట్నము వదలినా — సై
వార్త విన్న సుల్తానుడూ — ,,
శోకతొక్కిన కోడెత్రాచులా — ,,
సింహాసనమునుండి ఛట్టునా — ,,
చిందులుతొక్కుచు లేచాడా ॥భళా॥

వజీరునే రావించెరా — సై
ఫౌజుదార్ల బిలిపించెరా — ,,
వారలజూచి క్రూరంబుగా — ,,
పిరదౌసినే బంధింపగా ఫర్మానాలేయిచ్చాడా ॥భళా॥

అంతట సేనాపతులేంజేశారయ్యా!

పిరదౌసి కవినే బట్టగా — సై
అశ్వసైనికుల నంపెరా — ,,
వాడవాడకు, పల్లెపల్లెకూ గూఢచారులనెబంపారా ॥భళా॥

గాలించు గజనీ సైనికుల్ సై
పల్లెలు గుట్టలు పట్నముల్ ,,
మందిరములు మసీదులు ,,
విసిగి వేసారగ వెతికారా ॥భళా॥

గాలించు గజనీ సైనికుల్ సై
పిరదౌసి భార్యా బిడ్డలూ ,,
నడచుచున్న నట్టడవికే ,,
వచ్చియు అల్లా మాయచే ,,
వారల గాంచ లేకున్నారా ॥భళా॥

వెతకి విసిగిన ఫౌజులు సై
కూపీల గూఢచారులు ,,
కవినిగాంచగా లేకనే ,,
తెల్ల మొహాలతో మళ్లారా ॥భళా॥

సుల్తానుకీవార్త శూలమై సై
మదిని బాధింపగ మండెరా ,,
వచ్చినివారిని జెచ్చరా ,,
కవినిబట్టలేనివారనీ కొరడాలతో వారిగొట్టాడా ॥భళా॥

హాస్య :- ఆహాహా. అచ్చం పిచ్చితుగ్లకులా ప్రవర్తించా
డన్నమాట. యింకా యేంజేశాడుబాబూ.

సంగరరంగ విహారాధీరా శాత్రవసంహారా ॥భళాభళి॥

నాల్గుమూలలా నాల్గు దేశముల కాజ్ఞలుబంపాడా ॥సం॥
సామంతులకు సర్దారులకు చాటింపేశాడా ,,
పిరదౌసి తన పంచననుంచిన ప్రబలశత్రువౌనూ ,,

వ॥ అని యీవిధంబుగా తనరాజ్యంలోగల సామంతులకు, సుబేదారులకు ఫర్మానాలు బంపాడు. గజనీ సుల్తాను యొక్క అహంభావాన్ని అవ్యక్తతనుగాంచి వివేకులు, ధర్మబుద్ధులూ, జ్ఞానులూనైన కొందరు సామంత భూపతులు సమావేశమై సుల్తాను ఒక మహాకవికి చేసిన యన్యాయానికి చాలా చింతించి వారందరూకలసి సుల్తానుగారికి సమిష్టిగానొక లేఖ బంపారు. ఏమనయ్యా అంటే

హాస్య :- ఆగవయ్యా ఆగు నీతో మహాపేచీగావుందే. ఏ ధోరణి బడితే ఆ ధోరణేనా - సుల్తానుగారు తానిచ్చిన ధనాన్ని కవి తిరస్కరించి నందుకు శిరచ్ఛేధం చెయ్యమన్నాడా - దేశంవదలి పారిపోతే పట్టుకోలేక సామంతులకు తాఖీదులు పంపాడా - వోరి వీడి అవ్యక్తం మండా. యింట్లో మా ఆడది మాట వింటంలేదు. వీధిలోవున్న నాయాళ్లారా, మీ పెళ్లాల్తో మాట్లాడకండన్నాడట వెనుకటి కొకడు. అలా వుందయ్యా — తను ఆచరించకపోగా తన సామంతులుగాని, సుబేదారులుగాని కవికిగనక ఆశ్రియ మిచ్చారా ఖబడ్దార్ - నాకు శతృవులౌతారు - అని ప్రకటించారా - భలేగావుందయ్యా. అమ్మ పెట్టదు, అడుక్కు తిననీదు.

వంతగాడు:- అదేగదయ్యా రాజకీయం అంటే. చైనాకూ మనకూ తగాదా ఎందుకొచ్చిందంటావ్. మన

దేశానికి పొరుగున నేవున్న టిబెట్టు నాక్రమించుకొని, అక్కడ వాళ్లను నానాహింసలు పెడుతుంటే ప్రాణ భీతితో దలైలామా పారిపోయివచ్చి భారతదేశంలో తలదాచుకొన్నాడు. దలైలామాను తనకప్పగించమని చైనా కోరింది. అందుకు స్వర్గీయ నెహ్రూ అంగీకరించలేదు. అంతవరకూ "హిందీ చీనీ భాయీభాయ్" అని కేకలేసిన చైనావారు మెక్ మోహన్ రేఖ అనే సాకుతో భారత దేశంపై దురాక్రమణచేసి హిమాలయాలే మావన్నారు. ఇదేంన్యాయమయ్యా అంటే మీవాళ్లు పూర్వం మాకన్యాయం చేశారన్నారు.

హాస్య :- ఆగాగు ఇదంతా మేకపిల్ల - తోడేలు కథలా వుంది. (కథ చెప్పవలెను)

కథకుడు :- వినుమరి ఆ రేఖలో వారేం వ్రాశారు.

## పాట నెం. 2

రాజరాజా రాజాధిరాజా ! గజనిగద్దెనెక్కియున్న సుల్తాను
రాజ॥ రాజ॥

మీదు శౌర్యధైర్యములకు – మీదు సకలసంపదలకు
సర్వదా సలాము జేసేము రాజ॥

గడియించినారుగదా కనకరత్న చయములెన్నొ
ధననాయకుని దంతాలు పునియా

మీదు కీర్తికాంతి లతల - మేదినిపై వెదజల్లిన
కవిని జంపించుట - అపకీర్తి రాజ॥
అరువదివేల్దీనారములంపించుట దాతృత్వము
గజనీసుల్తానుల కది ఘనత రాజ॥
కవి ఋణము, గురు ఋణము చవులూరగ దీర్చువాడె
యల్లానిజభక్తుడంచందురు రాజ॥
కవిరాజౌ పిరదౌసిని - భువిరాజౌ మీరెంతయు
గారవించు టెంతో యుక్తంబు రాజ॥

వ॥ అని యీ విధంబుగా సామంత రాజులందరిచే సంయుక్తంబుగా వ్రాయబడిన లేఖను ఆసాంతంగా చదివిన సుల్తానులో ఒక విధమైన సంచలనం బయలుదేరింది. నిజంగా తానే పొరబడ్డాడా? పిరదౌసి తనకుచేసిన అపకార మేమిటి-తన వంశచరిత్రనంతా సుశాశ్వతంగా చరిత్రలో ఆకల్పాంతంగా వుండేటట్లు అమరకవితాకన్యను తన కంకితమిచ్చి తనను అమరునిగా జేశాడు అందుకు ప్రతి ఫలంగా నేనేంజేశాను! ఆడినమాటతప్పి దీనారాలకు మారుగా లోభినై వెండినాణాలను బంపాను. నిరాశా నిహతుడైన కవి నిరాకరించడం తప్పా? అనృతమాడిన రాజుపై యాగ్రహించడం అపరాధమా అని పరిపరి విధములగు ఆలోచనా పరంపరలతో మనసంతా అల్లకల్లోలమవగా మనశ్శాంతికై ప్రార్థనసలుపుకొన మసీదుకు వెళ్లాడు. అక్కడ మసీదు గోడపై పిరదౌసిచే గజనీని వదలిపోవునపుడు వ్రాయబడిన పద్యములను చదువు కొన్నాడు ఏమనివున్నది

రత్నరాసుల నడుమను రమ్యమొప్ప
స్థిరత ముక్కలు వేసియు సుంతయేని
భాగ్యమబ్బించుకోలేని బడుగునైతి
తుదకు ననుమ్రింగివేసెను తుచ్ఛజలధి.

దీనితో బాటు అలనాడు పిరదౌసి వ్రాసినలేఖ జ్ఞాపకం వచ్చింది తానెంత అవివేకంగా, క్రూరంగా, అమానుషంగా ప్రవర్తించాడో బోధపడింది. పరితాపదగ్ధహృదయుడై తన మందిరానికి తిరిగివచ్చి వెంటనే ఏం చేశాడయ్యా అంటే

వినరా ఆంధ్రకుమారాధీరా పిరదౌసీగాథా
మందిరమున కేతెంచిన గజనీ మంత్రినిరావించీ
పల్కెనిట్లు పశ్చాత్తాపముతో పరితాపముజెందీ
మంత్రివర్య పిరదౌసి కవికే నెంతోవంతగూర్చినాడా
ఆడినమాటను తప్పి అల్లాకే అపచారమొనరించు
నాపాపమునకులేదు విముక్తి నాదుగతేమౌనో
కవికిస్తానని వాగ్దానమిచ్చిన కనకంపు దీనారాల్
ఘనులగు ముల్లాలకిచ్చిబంపుడీ కరుణజూడుమనుడీ॥

వ॥ అనిపల్క యాజ్ఞాపింప

వెంటనె వజీరు వారునూ సై
అరువదివేల దీనారముల్ ,,
నూలుబస్తాలకె నింపెనా ,,
వంటెలారిటిపై కెత్తెనా ,,
దిట్టమైన ముల్లాలనూ ,,

సాయుధులైన సిపాయిలా సై
తోడునిచ్చి తాబంపాడా ॥భళా॥

వ॥ యింక నా తూసు నగరమున పిరదౌసి కవి గృహంబున- కవిగారి భార్య మనోవ్యధచే మరణించినది. భార్యా వియోగము, దారిద్ర్యబాధా, యీడువచ్చిన కుమార్తెకు వివాహం చేయలేకపోయితినే యనే విచారము అతనిని రోజురోజుకూ శల్యావసిష్ఠుని జేసినాయి.

మాయామాళవ గౌళరాగం

తంధానో ... అయ్యయ్యో - తంధానా వో దేవనందనానా
పిరదౌసికవి యేడాదినుండి వృద్ధాప్యభారమూనా
కటికదారిద్ర్యాపీడితుడై బహుకటకటనొందాడా
పెండ్లీడొచ్చిన ప్రియకుమార్తెనూ పలుమరుజూచాడా
విషాదరేఖలు తనయముఖానా పలుమరుగాంచాడా
నిస్పృహాయ నిట్టూర్పులతో నింగికి నమాజుజేశాడా
అయ్యో దేవా ఆర్తులమొఱలే ఆలింపకున్నాడా
తనదుకుమార్తెనుబాసి యాకవి తనువుచాలించాడా

వ॥ అలా నిరాశా నిస్పృహాలతో, విచారభారంతో తపించి, కృశించి, నశించిన కవి దేహం కాటికిచేరింది. సుల్తానుచే పంపబడిన ధనం కవి యింటికి జేరింది. విధివిలాసం. ఆధనాన్నిజూచి కవిగారి కుమార్తె దుఃఖముతో ఆగ్రహా వేశవివశయై ధనము తెచ్చిన ముల్లాలతో యేమంటున్న దయ్యా అంటే

## శివరంజని

తంధానా ... ... ...
ఇది నా తండ్రిని కష్టపెట్టినది యీధనంబునేడూ
ముట్టుదునా జనకుండు స్వర్గమున ముట్టబోడుగతులా
అయ్యా మమ్ముల ప్రేముడినెంతో యాదరించినట్టి
మీసుల్తానుకే మాసలాములని ముట్టజెప్పుడయ్యా
వ॥ అని యింకా కోపంపట్టలేక యేమంటున్నదయ్యా అంటే

## పాట నెం. 3

మేనిలోరక్తమ్ము ధారవోసిన తండ్రిప్రాణాలు
తీసివది పాపిష్టి యీధనము
దీనినేముట్టనని పల్కేనా దానిదాతనేదూషించి తెల్పేనా
మోసగాడైన మీసుల్తాను బాసలను మోహించి
యాకృతిన్ వ్రాసినా నాతండ్రి
దోసమెంతో యనుభవించాడూ,
అయ్యో స్వర్గలోకము జేరవేగాడూ
యీరీతిగామమ్ము యెంతో బాధించి
యీలోకాన యపకీర్తి నార్జించినాయట్టి
సుల్తానుకీధనము చేర్చండయా
తానైన సుఖపడమని చెప్పండయా
అని పల్కి యాధనమును తిరస్కరింపగా

## మలయమారుతం

మాటలవిన్న సుల్తాను మనుష్యులు ॥తంధాన॥
ధనముతోడ గజనీకి తరలిరీ ,,

కవి మరణంబు - కూతురు దుఃఖము ॥తంధాన॥
విషాదవాక్కుల విన్నవించినారా తంధానో ...
ఆపలుకులాలించి అహమదు గజనీ ॥తంధాన॥
కొలువునుండి తన కూటము జేరి ,,
పిరదౌసి కవినే పలుమారు దలచుచు ,,
ఘొల్లుఘొల్లుమని గజనీ విలపించె తంధానో ...

వ॥ అంత కొంతవడికి తెప్పరిల్లి, పిరదౌసీ కవిపేరు భూమిపై చిరస్థాయిగ నుంచదలచి, ఆతనికిస్తానన్న అరువదివేల సువర్ణదీనారముల వెచ్చించి పిరదౌసి జన్మస్థలమైన తూసు నగరమున పిరదౌసి పేరిట నొక బ్రహ్మాండమైన సత్రిశాలను నిర్మించెను. దాని శిథిలములు నేటికినీ తూసు నగరమున కవి కీర్తినీ గజనీసుల్తానుల అపయశస్సునూ చాటుచూ సాక్షీభూతమైయున్నవి.

## పాట నెం 4

వినరయ్య జనులార పిరదౌసి చరితాము
పిృయమొప్ప వీనూల విందూగనూ
ఆవిధంబుగ గజని ఆత్మలో చింతించి
కడకొక్క యోచననే గాంచాడయ్యా ॥వి॥
ఆతనికిస్తానన్న ఆధనముతోనొక్క
సత్రిశాలను నిర్మించాడయా ॥వి॥
నేటికాశిథిలాలు తూసునగరంబున
నాటిగాథను జాటి చెప్పేనయా ॥వి॥

కవిచరిత కృతిసలుపు గవిచర్ల సత్యనారాయ
ణాఖ్యునకగు జయము జయము
శ్రీరస్తు విజయోస్తు స్వస్తిఃసర్వేజనాస్సుఖనోభవంతు
సన్మంగళాని॥

## * మంగళం *

మాతానీకిదె మంగళం మా ఆంధ్రమాత నీకిదె మంగళం
కవిగాయకపండితప్రకాండులు కమనీయమునీప్రవిమలచరితము
గానముజేయగ సుభిక్షంబుగ గావుము
జాతిని ఘనముగ మాపూజ్య ॥మా॥

---

N. B:— యీ మంగళం పాటను చివరకు పాడవలెను.

---

హాస్య :- సరే బాగేనేవుందిగాని కథకుడుగారూ, ఎన్నిక లొస్తున్నాయిగదా. మరి ఓట్లూ గీట్లూ ఉంటాయి గదా. వాట్ని ఎవరికిమ్మంటావు, ఏమిటి కథా కమామిషు - శాస్త్ర చెప్పవయ్యా

కథకుడు:- ఒరే నాయనా - కుడితొక ఆవుకుపెట్టి పాలింకొక దాన్నిమ్మంటే ఎలాయిస్తుందిరా - పాలిచ్చేగొడ్డుకే కుడితిపెట్టాలి. అలాగే ప్రజాస్వామ్యం, ప్రజాక్షేమం పరిరక్షించేపార్టీకే మనమంతా ఓట్లిచ్చి గెలిపించాలి.

హాస్య :- అలాటి పార్టీ యేదో, దాని కథేమిటో చెప్ప వయ్యా శాస్త్ర.

కథకుడు:- అయితే విను మరి.

వినరయ్య చెబుతాను జాతీయ కాంగ్రెసు
విమలచరిత్రంబు వివరంగా

పరప్రభుత్వంబును పరదాస్యమును బాపి
స్వాతంత్ర్యమిచ్చినా సంస్థ కాంగ్రెస్ ॥విన॥
అమర గాంధీ నెహ్రూ ఆంధ్రకేసరి బోసు
లాల్ బహద్దరుల ప్రియ సంస్థ కాంగ్రెస్ ॥విన॥
సోషలిజమే ప్రజాస్వామ్య ధ్యేయంబని
శ్రమియించుచున్న మన సంస్థ కాంగ్రెస్ ॥విన॥
నిన్న మొన్నను బంగ్లా అన్నలనుగాపాడి
సన్నుతింపగబడిన సంస్థ కాంగ్రెస్ ॥విన॥
రాణి రుద్రమవలె రాణకెక్కిన నేత
యిందిరా గాంధి తానున్న కాంగ్రెస్

అట్టి కాంగ్రెస్ కే

## పాట

ఓటిచ్చి మేల్పొందు మోయన్నా-మాటలింకేలరా మాయన్న

ఓటులో నేనీదు సీటుకూడున్నాది -
తప్పటడుగేస్తివా ముప్పువస్తుందిరా

దేశక్షేమముగోరు పెద్దన్నా -
జాతిభవవితవ్యమురచిన్నన్నా ॥ఓ॥

అంతేగాక

పాడి పంటల సౌభాగ్యము సై
పారిశ్రామిక ప్రగతియూ ,,
విద్య విజ్ఞానాభి వృద్ధియూ ,,
ప్రతి పౌరునకూ భద్రితా ,,
కూడును గుడ్డా గృహాములూ ,,
అమరాలని ఆశించినా ,,
జాతీయ కాంగ్రెస్ సంస్థకే ,,
ఓట్లనిచ్చి గెలిపించండయూ

॥భళానోయి భాయితమ్ముడా-మేల్భళానోయి దాదానా॥

ఓం తత్సత్

స్వస్తిః

శ్రీ శ్రీ శ్రీ



